గురు గురు మనియు ధ్వనులుగలిగి యుండును. సామాన్యముగా కడుపు బిగబట్టినట్లునొప్పులుగాని పొర్లిపొర్లివచ్చు నొప్పులుగాని ఉండవు. అరుదుగనుండుటయు గలదు. సామాన్యముగా విరేచనములు ప్రారంభించినతోడనే బహునీరసముగనుండి మనిషిని పడగొట్టును. తక్షణమే కాళ్లు చేతులు చలవలు గ్రమ్మవచ్చును. ఉమ్మిచిక్కబడి దాహమధికమగును. నాలికె తెల్లబారును. కాళ్లు చేతులీడ్చుకొనిపోవును.

వాంతులు.

విరేచనములు ప్రారంభించిన ఒకటి రెండుగంటలలోగా వాంతులు ప్రారంభమై ఒకవాంతిమీద మరియొకటి తరుముకొనివచ్చినట్లుగా నగును. వాంతిలో మొదట అరగిఅరగని అన్నము వెలువడును. పిమ్మట విరిగిన పాలలోని నీళ్లవలె నుండును. తరువాత విరేచనముయొక్క కడుగువంటిరంగే వాంతులకును గలుగును. వాంతిఅగుటకుపూర్వము సాధారణముగా నధికమైన వికారముండదు. వాంతిఅగుటకును మిక్కిలికష్టపెట్టదు. ఊరకే దిమ్మరించునట్లుగా పెద్దపెద్దవాంతులు మడుగులు గట్టినట్లగును.

ఈడ్పులు కొంకర్లు.

వీనితోపాటునిస్సత్తువ అధికమై కాళ్లుచేతులలో ఈడ్పులు హెచ్చి కొంకర్లుబోవును. కండలన్ని

యు కొయ్యలవలె నిగుడుకొనును. రోగియిట్టి దశలో గిజగిజతన్నుకొనుచు ఇటునటు దొర్లాడును. చేతులను ఈవైపునుండి ఆవైపునకును ఆవైపునుండి ఈవైపునకును. విసిరికొట్టుచు బహు ఆయాసముతో మిక్కిలి విసుగుతో అతి దాహముతో ఎదురు రొమ్ము మంటతో కాళ్ల ఈడ్పులతో నలిగిపోవును. అంతట కాళ్లుచేతులు, చలువలుగమ్మి రోగిమూర్ఛిల్లినట్లు పడిపోవచ్చును.

శరీరములోని నీరుహరించిపోవును.

విరేచనములు మూలమునను, వాంతులుమూలమునను, శరీరమునందలి నీరంతయు వెడలిపోవుటచేత ముఖము మొదలగు మెత్తనిభాగములన్నియు వాడిముడతలు పడును. చెక్కిళ్లుదించుకొనిపోవును. ముక్కుసన్నగించి వడలినట్లుండును. కండ్లు గుంటలపట్టును. వ్రేళ్లు చాకలవాని వ్రేళ్లవలె నీళ్లలోనానినట్లు ముడుచుకొని పోవును. శరీరము కాంతివిహీనమై నలువారి చల్లని చెమటతోకప్పియుండును. గొంతుక బొంగురుపోవును. మూత్రము హరించిపోవును.

ఉచ్ఛ్వాస నిశ్వాసముల వేగమధిక మగును. ఊపిరివిడుచుటకు అతి ఆయాసముగ నుండును. ఊపిరిగాలి మిక్కిలి చల్లబడును. క్రమముగా గొం

గొంతుకబొంగురుపోవును; నాడిసన్నగించును.

తుక యొక్క బొంగురు హెచ్చి, రహస్యపుమాటలవ లెదిగును. నాడిసన్నగించి నీరసముగ, అతివేగముగ, పరుగెత్తుచుండును. పిమ్మట కొంతకాలము వరకు నాడివచ్చుచు పోవుచుండును. మినుకుమినుకు మను చుకనుపట్టుచు తుదకు బొత్తిగ నగుపడకుండ నుండ

శరీరవేడిమితగ్గును.

వచ్చును. శరీరవేడిమి వేగముగననేకడిగ్రీలుతగ్గిపోవును. 93 లేక 94 డిగ్రీలవరకునుపడిపోవచ్చును. చంకలోనున్న వేడిమితంటె నోటిలోని వేడిమి ఇంకను నాలుగైదు డిగ్రీలు తక్కువగ నుండుటయు గలదు ఇట్టి సమయములయందుకూడ ఆసనమునందలి వేడిమియు, శరీరములోపలనుండెడు ఇతరఅవయవముల వేడిమియు క్రమక్రమముగ నధికమై సామాన్యముగ 101 మొదలు 105 డిగ్రీలవరకు హెచ్చును.

షరా:—సామాన్యముగా మానవశరీరముల వేడిమి ఫారనుహీటు థర్మామీటరు * అనుగాజుకొలతపుల్లతో పరీక్షించిచూచిన 98½ డిగ్రీలుండును. ఈకొలతపుల్లకుమనశరీర వేడిమిచక్కగఅంటుటకై కొన్ని నిమిషములు ఆపుల్లను చంకలోగాని, నోటి

* దీనిని తెలుగులో ఉష్ణతామాపకణము అందురు. దీనిర్మాణమునగూర్చి పదార్థ విజ్ఞానశాస్త్రమునందువ పుటల చూడుము.

లో నాలుకక్రిందగాని ఉంచి పరీక్షించుదురు. చంకలోవేడిమికంటె సామాన్యముగానోటివేడిమియు, ఆసనవేడిమియు, ఒకడిగ్రీకి మించకుండ అధికముగ నుండును; అనగా 99 లేక 99½ డిగ్రీలుండును.

మూత్రము హరించును.

ఈ వాతపుదశలో కొంతసేపటికి విరేచనములు కట్టునుగాని వాంతులెప్పటివలెనేయుండును. మూత్రము క్రమక్రమముగ తగ్గి తుదకు మొదలంటహరించిపోవును. ఈదశయందు రోగి మిక్కిలి విసుగుదలగలిగి యుండి మాట్లాడుట కిష్టములేనివాడైనను మనో నిర్మలత్వము సామాన్యముగ చెడియుండదు.

మనోనిర్మలత్వము.

ఈదశ కలరా గుణములు ప్రారంభించినతరువాతఅయిదారు గంటలలోగా కనబడి పన్నెండు గంటలుమొదలు ఇరువదినాలుగు గంటలవరకును విడవక యుండవచ్చును. సామాన్యముగా ఈ దశనుండి తెప్పరిల్లకయే క్రమముగా స్పృహదప్పి యొకానొకప్పుడు సంధించి పరాకు మాటలలోదింపి రోగిమృతినొందుట గలదు. ఒకానొకప్పుడుఆరంభదశలేకయే వ్యాధి ప్రారంభించుటలోనే వాతపుదశ ప్రారంభించి విరేచనములు కాకమునుపే ఒడలు చలువలు గ్రమ్మిక్రుంగిపోవుటయుగలదు.

ఉష్ణదశ;జ్వరము.

౫. ఉష్ణదశ—వాతపుదశలో దిగిన తరువాత పది పన్నెండు గంటలలో రోగి మృతినొందనియెడల క్రమముగా వాంతులు విరేచనములును, సంఖ్యయందును, పరిమాణమునందునుతగ్గును. చేతియందునాడి తిరిగి యాడుటకు ప్రారంభించును. శరీరమునందంతు వేడిమిక్రొద్దిగ వెలుపలకు స్ఫురించును. ఈచిహ్నము చూచిన తోడనే మనమురోగినిగూర్చి ధైర్యము బూనవచ్చును. ఇట్టిరోగులయందు ఇంతకు పూర్వము హరించిన మూత్రము కొన్ని గంటలకు తిరిగి స్రవించి రోగిని అపాయమునుండి తప్పించును. ఇట్టివారలు కొద్దిరోజులలోనే శరీరబలమును తిరిగి సంపాదించుకొందురు.

ఇట్లుగాక ఒకానొకప్పుడు శరీరము వెచ్చబడి, నాడి స్ఫుటపడి, ముఖవైఖరి బాగుపడి, పిసుగుదలమాని, మూత్రము స్రవించి, విరేచనములు హరించి, జీర్ణరసము లుద్భవించునట్టి సమయములో ఉష్ణము మరింత అధికమై జ్వరము అంకురించును. కొద్దిజ్వరమైన యెడల కొన్ని ఘడియలలోనే దిగిపోవును. లేచిచో సామాన్యముగా నాలుగైదు రోజులును, అరుదుగ పదిహేనురోజులవరకును ఈజ్వరము బాధింపవచ్చును. ఇప్పుడువి

రేచనములు కొంచెము పసరెక్కిచెడువాసనగనుం
డును. మూత్రము రెండురోజులు మొదలు ఆరురో
జులవరకు ఒక్కొక్కప్పుడు రాకయుండును. మొ
దటనది వచ్చునప్పుడు కొద్దిగను, ఎర్రగను, మలిన
ముగను శ్వేతధాతువుగలదిగను ఉండును. క్రమ
ముగ నధికమై తెల్లనైన దగును. మొదట మూ
త్రమునందు యూరియా, యూరికామ్లము, లవ
ణాదులు మిక్కిలి తక్కువగ నున్నను క్రమముగ
కొన్నిరోజుల వరకును ఇవిమూత్రమునందు మా
మూలుకంటె నెక్కువగనుండవచ్చును.

చికిత్స.

ఇంతవరకు కలరావ్యాధియొక్క గుణముల నెరిగి యున్నాము. ఇట్టివ్యాధికి చికిత్సచేయుటలో గమనింపవలసిన అంశములను సంగ్రహముగ వ్రాసెదము.

ఆయుర్వేదమార్తాండపండిత డి. గోపాలాచార్యులవారిచ్చిన ప్రయోగములను కొన్నిటిని అక్కడక్కడ తగురీతిని వివరించియున్నాను. ఆప్రయోగములును ఉభయయుక్తమైనవగుటచే వానినికూడ సమయానుకూలముగా ఉపయోగించుకొనవచ్చును. నేనువ్రాసిన ప్రయోగములును, వారిప్రయోగములును ఒకటికొకటివిరోధములుగా పనిచేయునని తలంపవలదు. ఒకటికొకటి సహాయకారులుగానుం

డునట్లు యోచించి వ్రాయబడినవి. వారిమందులను చక్కగ తయారుచేసి కొనలేనివారలు, వారిపేర చెన్నపట్టణమునకు వ్రాసి తెప్పించుకొనవలెను.

కారణమును బట్టి చికిత్స.

I. వ్యాధియొక్క కారణమును బట్టిచూడగా కలరా సూక్ష్మజీవులు పేగులలో నున్నప్పుడు వానినిచంపుటకు ప్రయత్నించుట ముఖ్యమైనపనిగా తోచును.

గుణములను బట్టి చికిత్స.

II. వ్యాధియొక్క గుణములను బట్టిచూడగా ఈక్రిందవ్రాయబడిన 8 విషయములు ముఖ్యమైనవిగా తోచును.

1. విరేచనములను ఆపుట.

2. వాంతికట్టించుట.

3. శరీరముయొక్క వేడిమి తగ్గి పోకుండ కాపాడుట.

4. విరేచనములమూలమున శరీరమునందలి నీరంతయుపోవుటచే శరీరమునందలి నెత్తురు చిక్కబడును. అట్లుచిక్కబడిననెత్తుటిని పలుచనచేయుటకును, తగ్గిపోయిన నెత్తుటిని తిరిగిపూర్తి చేయుటకును ప్రయత్నించుట.

5. నీరసించిననాడికి బలమునిచ్చుట.

6. కాళ్లుచేతులు కొంకరులుపోకుండను ఈడ్చు కొనిపోకుండను చేసి రోగియొక్క బాధను నివారణ చేయుట.

7. హరించిపోయినమూత్రమును తిరిగి స్రవింప జేయుట.

8. పథ్యము.

I. సూక్ష్మజీవులను నశింపుచేయుట.

ఇందునిమిత్తమై శాలాలు (Salol) 5 మొద లు 15 గ్రెయినులు, లేక క్వాయికాలుకార్బనేటు 3 మొదలు 10 గ్రెయినులులేకహారతికర్పూరం 2 మొదలు5 గ్రెయినులు మొదలగునవి కొందరిచ్చెదరు.

సూక్ష్మజీవుల ను నశింపుచేయుటకై చేయు చికిత్స.

మరికొందరు ప్రథమదశయందు వచ్చినరోగికి జాడించి ఒకటిరెండు విరేచనములగునట్లు ఒకపలం ఆముదముగాని అరపలంమొదలు ఒకపలమువరకు మగ్నగంధకితము (Magnesium Sulphate) అను ఉప్పును గ్రుక్కెడు నీళ్లతోచేర్చిదానినిగాని మొట్ట మొదటనిచ్చి, విరేచనమైన తరువాత రసభస్మము (Calomel) గ్రెయినులో 6వ-వంతుచొప్పున గంట గంటకు ఇచ్చుచు వచ్చెదరు.

కొందరీ రసభస్మమునే మొదట 5 గ్రెయినుల మోతాదులరెంటి నిచ్చి తరువాత 3 గ్రెయినుల

మోతాదులను 6 గంటల కొకటి చొప్పున ఇచ్చుట మంచిదని వ్రాయుచున్నారు.

కాని రసభస్మము హెచ్చు మోతాదులుగా నుపయోగించుటవలన ప్రయోజనమంతగా కానరాదు. సూక్ష్మజీవులను చంపుటకు మాత్రమే ఉద్దేశించి ఇయ్యబడినయెడల గంట గంటకుగ్రెయిను లో 6వ వంతు మోతాదుల చొప్పున ఇచ్చుటయే మంచిది. ఈవ్యాధియొక్క ప్రథమ దశలో ననేక సారులు నేనుదీనిని మిక్కిలి యుపయుక్తముగకను గొంటిని.

వేడిగనుండు వగరు పదార్థములను 2 గంటల కొకసారి పేగులలోనికి ఆసన మార్గమున పిచికారీ చేసినమంచిది. సలసలకాగి చల్లారిన నీళ్లలో వేయింటికి 5 పాళ్లు టానిక్ ఆసిడ్డును, నల్లమందు అరఖు 5 పాళ్లును, తుమ్మజిగురు 30 పాళ్లునుచేర్చి కలిపి ఆద్రావకమును గోరువెచ్చగా నుండునట్లుగా మెల్ల మెల్లగా పేగులలోనికి ఆసనమార్గమున నెక్కించవలెను. ఈ టానిక్ ఆసిడ్డు కలరా సూక్ష్మజీవులకు బలవద్విరోధియగుటచే వానినక్కడ నశింపుచేయునని యు అందుచే ఈప్రయోగము మిక్కిలిఉపయోగకరమనియు ఒకరు వ్రాయుచున్నారు.

పయిన జెప్పిన మందులన్నియు సూక్ష్మజీవుల ను నశింపుజేయు నుద్దేశముతో వాడబడుచున్నవి.

II. ఇక నీ వ్యాధియొక్క గుణములనుబట్టి చేయవలసిన చికిత్సను ఆలోచింతము.

1. విరేచనములను ఆపుట.

విరేచనములను ఆపుటకు చికిత్స.

ఇందు కొరకు సామాన్యముగా లెడ్ అసిటేటు 20 పాళ్లను నల్లమందు 1 పాలును హారతి కర్పూరం 10 పాళ్లనువేసి ఒక్కొకమాత్ర 3 గ్రయినుల చొప్పున మాత్రలుకట్టి అరగంటకొక మాత్రవిరేచనములు కట్టువరకు ఇచ్చెదరు. మరికొందరు

డైల్యూటు ఆరోమేటిక్ సల్ఫ్యూరిక్ ఆసిడ్డు. } 10 చుక్కలు

నల్లమందు ద్రావకం 10 చుక్కలు

గ్రుక్కెడు నీళ్లతో చేర్చి 3 గంటల కొకసారి ఇచ్చెదరు. ఇతరులు

కాంఫర్ డైన్ 10 చుక్కలు

* డైల్యూటుసల్ఫ్యూరిక్ ఆసిడ్డు 15 చుక్కలు

గుక్కెడు నీళ్లతో 3 లేక 4 గంటల కొకసారి ఇచ్చెదరు.

ఈ మందులు కొంతవర కుపయోగమే కాని వీనికంటె ఈక్రింద వ్రాయబోవు మందు కలరా

* అనగా సల్ఫ్యూరిక్ ఆసిడ్డు-1 పాలు. వాననీరు-11 పాళ్లు.

యొక్క ప్రారంభ స్థితిలోని విరేచనములకు మిక్కిలి యుపయుక్తమని నేనుచెప్పగలను.

ఆరోమేటిక్ సల్ఫ్యూరిక్కు ఆసిడ్ డైల్యూటు } 20 చుక్కలు

కవిరిద్రావకం(Tincture Catechu) 60 చుక్కలు

ఓమ ద్రావకములేకసోపువిత్తుల ద్రావకము (Spirits Anethi) } 15చుక్కలు

నల్లమందుద్రావకము(Tincture Opii)10చుక్కలు

స్పిరిట్సు ఈథర్ (Spirits Aether) 15 చుక్కలు

మొత్తము 120 చుక్కలు.

ఈ మందుయొక్క మోతాదు పెద్దవాండ్రకు 60 మొదలు 120 చుక్కలు. ఒక మోతాదును 3 గంటల కొకసారిగాని, విరేచనములు హెచ్చుగ నుండని యెడల ఒక్కొక విరేచనమునకు ఒక్కొక మోతాదు చొప్పునగాని ఇయ్యవలెను.

ఆడవాండ్రకు అరమోతాదులతో ప్రారంభింపవలెను. 12 సంవత్సరములలోపు వయస్సుగలపిల్లలకు సంవత్సరము వయస్సునకు 5 చుక్కలుచొప్పున ఈయవలెను. సంవత్సరములోపు పిల్లలకు నెల వయస్సునకు అరచుక్క చొప్పున ఇయ్యవచ్చును. అయినను పిల్లల కిచ్చునప్పుడు జాగ్రతగా చూచు

చుండవలెను. ఈమందును ఎల్లప్పుడును ఒక్కొక్క మోతాదు ఒక అవున్సు అనగా గ్రుక్కెడు నీళ్ల తోచేర్చి ఇయ్యవలెను. కొంచెము నీళ్లు ఎక్కువ చేర్చినను జబ్బులేదు. ఈ మందును సాధారణము గా కలరా విరేచనములకేగాక ఇతర విరేచనము లకుగూడ వైద్యుడు తన అనుభవము కొలదిని ఉపయోగించుకొనవచ్చును.

ఇది సాధారణముగా ప్రతి ఇంగ్లీషు మందుల అంగడిలోను ఆసుపత్రిలోను దొరుకును. లేదా నాపేరవ్రాసెడు వారలకు నేను పంపించెదను. ఒకమొతాదునకు సాధారణముగా ఒక అణా ఖరీ దు ఈయవచ్చును.

మొదటి దశలో పైచెప్పిన మందులన్నియు కొంతవరకుపయోగకరముగానుండవచ్చును. కాని తొందరకొలది ఆమందు కాదని ఇదిఅదికాదని యిం కొకటి లెక్కలేకుండ నియ్యకూడదు. అనవసరమైన మందులను మితిలేకుండ నిచ్చినయెడల అవి రోగికి హానికలుగచేయవచ్చును. ఏలయన, కడుపులో అట్టి సమయమున ఏది పడినను వాంతిబాధ అధికమగు ను. ఒకవేళ అది ఇమిడినను శరీరమునందలి రక్త

ప్రవాహము అప్పుడు మిక్కిలి మందమై యుండుట చేత ఆమందులు జీర్ణము కానేరవు.

విరేచనము లధికముగా నుండక కడుపునొప్పి మిక్కిలి అధికముగా నున్న యెడల నల్లమందు కొంతవర కుపయుక్తము. దానినిగూడ పైజెప్పిన కారణములచేత నోటిమార్గమున నిచ్చుటకంటె నేర్చినవైద్యుడు నెత్తురులోనికి తగిన గాజుపిచికా రీతో పిచికారీచేయుట యుక్తము.

ఆయుర్వేదీయచికిత్స. విరేచనములను నిలుపుటకై గోపాలాచార్యుల వారు ఈ క్రిందప్రయోగములను వ్రాసియున్నారు.

౧. "శుద్ధిచేసిన ఇంగిలీకము.
నల్లమందు.
తుంగముస్తలచూర్ణము.
కొడిశపాలవిత్తులచూర్ణము.
జాజికాయచూర్ణము.
హారతికర్పూరము.

వీనినన్నింటినిసమభాగములుగ గ్రహించి ఖల్వములోవేసి చక్కగనీళ్లతో మెత్తగమాత్రలగువర కు నూరి పెసలవలె మాత్రలుచేసి నీడను యెండిం చి సీసాయందు జాగ్రతచేయవలెను. విరేచనము లు అధికమగుచుండెనేని, రెండేసి గంటలకు రెం

డుమాత్రలు చొప్పున విరేచనములు నిలుచువరకును ఇయ్యవలెను. ఈ ఔషధమునకే భైషజ్యరత్నావళియను ఆయుర్వేదీయ గ్రంథమందు "కర్పూర రసము" అని పేరుపెట్టఁబడినది.

౨. తుంగముస్తలచూర్ణము.
కొడిశపాలవిత్తులచూర్ణము.
మిరియాలచూర్ణము.
ఎండుమిరపకాయలచూర్ణము.
హారతికర్పూరము.
నల్లమందు.

వీనిని సమభాగములుగ గ్రహించి ఖల్వములో ఉంచి నీళ్లతో మాత్రయగువరకు మెత్తగమర్దనచేసి కందిగింజవలె మాత్రలుచేసి సీసాలోవేసి జాగ్రతగానుంచవలెను. పైనిఁవ్రాసిన ప్రకారమువీనిని ఉపయోగింపవలెను. ఈ మాత్రలనె మా ఆయుర్వేద వైద్యశాలయందు 'ఘనసారవటి' యనివాడెదము.

ఒకతులము ఎండుమిరపకాయగింజలను మూకుటిలోవేసి *దోరమాడ్చి అంముపావుశేరు నీళ్లువేసి కొంచెముసేపుంచి యానీటితో నాగింజలను బాగుగకలిపి వడగట్టుకొనిమంచిపాత్రయందు భద్రముచేయవలెను.

విరేచనములు ఆరంభమైనతోడనే ఒక్కొక్క గంటకు గ్రుక్కెడుకషాయమును త్రాగవలెను. ఈ కషాయమును ఉపయోగించెడి యాచారము ప్రతి పల్లెయందును అందరికిని విదితమయియున్నది. ఈ కషాయమునే పైనిజెప్పిన రెండురకములమాత్రలకు అనుపానముగ కొంచెముపంచదారతో కలిపిఇయ్య వచ్చును.

3. శుద్ధరసకర్పూరము.
శుద్ధరససిందూరము.
శుద్ధఇంగిలీకము.
శుద్ధిచేసినవత్సనాభి.
పాదరసము.
గోరోజనము.
మిరియాలు.
కస్తూరి.
జున్ను (లేకఆడిపచ్చికాన).
నల్లమందు.

ఈవస్తువులనుసమభాగములుగ గ్రహించి, కస్తూరినల్లమందుగాక, మిగిలినఅన్నివస్తువులను ఖల్వములో వేశి చనుబాలతో మెత్తగానూరి బిళ్లగాచేసి ఆబిళ్లను, లేతరావి ఆకుమడతలోఉంచి పైనదార

ముత్తోకట్టి పిడకలనిప్పులో ఉడుకునంతవరకు ఉం
చవలెను. అటుపిమ్మట కుమ్ములోనుండితీసి పైనిఆ
కులను విప్పివేసి లోపలబిళ్లనుతీసికొని తిరుగఖల్వ
ములోనుంచి చనుబాలతో బాగుగా రెండుమూడు
గంటలు నూరి తిరిగిబిళ్లచేసి పై ప్రకారము రావి
ఆకులమడతలోఉంచి ఉడుకునట్లు పుటము వేయవలె
ను. ఈరీతిని ఏడుసార్లునూరుచు పుటము వేయవలె
ను. ఎనిమిదవతడవ, కస్తూరినినల్లమందునుచేర్చి, బా
గుగా మూడు జాములు చనుబాలతోనూరి, కంది
గింజలవలె మాత్రలుచేసి నీడనుయెండించి సీసాలో
భద్రపరచవలెను. విరేచనములుఅధికమై నాడి బల
హీనమై సర్వశరీరము బలములేకయుండి, మూత్ర
ము వెడలక నిశ్చేష్టితులై యుండెడి, రోగులుకూడ
వేలకొలది ఆసన్నమృత్యువునుండి తప్పించుకొనియు
న్నారు. ఇయ్యది మా సప్తపూరుషములనుండి యను
నుభవసిద్ధమగు ఔషధరాజము. ఇయ్యది ఏస్థితిలో
నుండు కలరానైనను బోగొట్టుటయేగాక బాలింత
లకు గలుగుగ్రహణి, అతిసారములు, ఇతరులకుంగల
చిరకాలాతిసారములు గ్రహణి రోగములను కూడ
మాన్పును. కలరా రోగులకుమాత్రము పైనచెప్ప
బడిన మాత్రలను ఉపయోగపరచినట్లే ఈ మా

త్రలనుకూడ పథ్యాధర్మములననుసరించి ఉపయో
గింపవలెను. ఇతర అతిసారగ్రహణి రోగులకు,
రోజుకు 3 సార్లుగాని లేక వ్యాధితొందరను అను
సరించిగాని బుద్ధిమంతులగు వైద్యులు ఉపయో
గపరచవలెను. ఈ మాత్రలనే మా వైద్యశాల
యందు "కస్తూరిగ్రహణిమాత్రలు" అనివాడెదము.

8. మరియుకొందరు దేశీయవైద్యులు భాండవక
ర్పూరము (రసభస్మములేక ఇంగిలీక భాండవము)
అనుదానిని వారికితోచినట్లుకలరారోగులకుపయో
గించెదరు. ఇయ్యది కలరా రోగులకు మంచిదైన
ను ఉపయోగించెడివారలు, కొంచెము జ్ఞానముగ
లిగి, కలరాయొక్క ప్రారంభదశయందు, రోగియొక్క
స్థితిని చక్కగ పర్యాలోచనచేసి తగుమోతాదు
అనగా నాలుగు మొదలు ఎనిమిది గురిగింజలయె
త్తువరకును దీసికొని దానిని చక్కని మాటుతోశి
ఒక గురిగింజప్రమాణముగల మాత్రలుగాచేసి, ప్ర
తియొకగంటకు ఒకటిగాని రెండుగాని మాత్రలు,
వ్యాధిబలమును చూచుకొని ఉపయోగించిన మి
క్కిలి మేలుచేయును. క్రూర స్వభావముగల దీనిని
కుశలులగు వైద్యులు రోగిదశను నిరీక్షించి ఉప
యోగించుట ఉచితముగాని సామాన్యులు దీనికై

సాహసించుట అతిఘోరముగా పరిణమించును. మోతాదునుకూడ 4 గురిగింజలు మొదలు 8 గురిగింజలకంటె అధికముగా నుపయోగింప కూడదని నామతము. ''

2. వాంతికట్టించుట.

మంచుగడ్డముక్కలు చప్పరించుట కిచ్చుటచేత నుమిక్కిలిశీతలోదకములను కొంచెముకొంచెముగా నిచ్చుటచేతను వాంతి కొంతవరకు కట్టవచ్చును. కానికాగిచల్లారిగోరు వెచ్చగానున్న నీళ్లలో శేరు నీళ్లకు తులము ఆవాలపిండిచొప్పున వేసి కలిపిఅప్పుడప్పుడిచ్చుటవలన కొంచెము సేపటిలో వాంతికట్టునని ఒకరు వ్రాయుచున్నారు. మరియొకరు రసభస్మమును పెద్దపెద్ద మోతాదులతో అనగా 15 లేక 20 గ్రెయినులవరకు ఇచ్చుట వలన వాంతి తగ్గునని వ్రాసియున్నారు. తక్కిన ప్రయోగములన్నియు ఉపయోగింపని యెడల దీనినిచ్చి చూడవచ్చును. కానినీళ్లతో చేర్చి మెత్తగనూరిన ఆవపిండి పట్టు బొడ్డుమొదలు ఎదురొమ్ము వరకువేసి 40 నిమిషములు మొదలు ఒక గంటవరకు ఉంచుటవలన వాంతి అణగి రోగికి ఉష్ణమునుగూడ నిచ్చును. ఇది మిక్కిలి ఉపయోగకరము. దాహమధికముగ

వాంతికట్టించుటకుచికిత్స.

నున్న చో మంచుగడ్డముక్కల నియ్యవచ్చును. శేరునీ టికి తులముచొప్పున జీలకఱ్ఱ వేసికాచి చల్లారిననీటి ని కొంచెము కొంచెముగ దాహమున కిచ్చుటచే ఉపయోగింపవచ్చును. వీనిచే వాంతికట్టనియె డల కొకెయినును గ్రెయినులో నాల్గవ వంతు ఇచ్చి చూడవచ్చును. క్రియసోటు, హైడ్రోసయానిక్ ఆసిడ్ డైల్యూటువీనివలన అంతగా ఉపయోగము లేదు. సోడా లెమనేడు మొదలగుపొంగునీళ్లనుకొం చెము కొంచెముగా నిచ్చుటవలన వాంతి కొంతవ రకు తగ్గవచ్చును.

గోపాలాచార్యులవారు ఇట్లు వ్రాయుచు న్నారు.

ఆయుర్వేదీయచికిత్స. "వాంతిని నిలుపుటలో మంచుగడ్డకంటె మంచి దిలేదని నాయభిప్రాయము. ఆవపిండిని ఎదురొమ్ము నుండి బొడ్డువరకు పట్టువేయుట ఉచితము. జీలకఱ్ఱ కషాయము నియ్యవచ్చును. ఏలకులను పొట్టుతో కషాయముచేసి, జీలకఱ్ఱ కషాయమువలెనే ఈయ వచ్చును. పంచ దారపానకములో కొంచెము పులు సెక్కునట్లు నిమ్మకాయ రసమునుపిండి ఆపానకము ను ఒక గ్రుక్కెడు చొప్పున ఇచ్చుచుండవచ్చును. లేత పనుడిపత్తి కాయ తేనెతోగాని నిమ్మకాయ ర

సముతోగాని సానమీాద నరగతీసి అప్పుడప్పుడునా
లుకమీాద కొంచెము కొంచెము రాయుచుండుట
మంచిది. నెమలి ఈకలను, ఏలకగింజలను ఉసిరిగిం
జలోనిపప్పును తెల్లపట్టుగుడ్డను సమపాళ్లుగా దెచ్చి
మూకుడులోవేసి చక్కగా మాడ్చి చల్లార్చి మెత్త
గా నూరి శీసాలోవేశి భద్రపరుచు కొనవలెను.
ఇది వాంతులకు పదేపదే తేనెతోకలిపి నాలుకకు
రాయుచుండవలెను. మూడుతులముల ఓమమును
మూకుడులోవేసి మాడ్చి అందు ఒకశేరు నీళ్లుపోసి
కొంచెము సేపుంచి వడియకట్టి, వాంతి నిలుచువర
కును ఒక్కొక గుక్కెడు ఇయ్యవలెను.

పైరీతిగనే బియ్యపునూకలనుగూడ మాడ్చి నీ
ళ్లుపోసి వడియకట్టి ఇయ్యవచ్చును. వరి పేలాలపిం
డిని వేడినీళ్లలో కొంచెమువేసి, తేటగా కలిపి వడగ
ట్టి అప్పుడప్పుడు వాంతి నిలుచువరకు ఇయ్యవచ్చు
ను. వాంతులు విశేషముగా నున్నప్పుడు పైద్రవ
పదార్థముల నధికముగ నుపయోగించిన, వాంతి అ
ధికమైనను కావచ్చును. కావున వానిని కొంచెము
కొంచెముగ ఇచ్చుటమంచిది. వాంతిని కట్టించు ఏ
వస్తువునుగాని మంచుగడ్డతో మిళితముచేసి ఇచ్చు
ట ఉత్తమమని నామతము. చనుబాల నిచ్చుట

గూడ ఉత్తమము. మంచి సూర్యావర్తిని గూడ వాంతిని నిలుపుటకు ఉపయోగింపవచ్చును.

ఎక్కిళ్లను ఆపుట.

ఎక్కిళ్ళ నాపుటకు జిలకర్ర బెల్లము సమముగా నూరి ఉండచేసి ఉంచుకొని కొంచెము కొంచెము ఎక్కిళ్లు తగ్గువరకును ఇయ్యవలెను.

ఏలకులు.
ఆకుపత్రి.
నాగకేసరాలు.
దాల్చినచెక్క.

వీనిని సమముగా గ్రహించి మంచినీళ్లతో కషాయము పెట్టి వడకట్టి ఆకషాయమును అప్పుడప్పుడు ఎక్కిళ్లు తగ్గువరకును ఇయ్యవచ్చును. మరియువాంతులు తగ్గుటకై ఉపయోగించు మందులనన్నిటిని ఉపయోగింపవచ్చును. మంచినీళ్ల దరులలో గల పీతబొక్కలలోని చల్లనినీళ్లనిచ్చుటగూడ మంచిది. వెలగపండు పై బెరడును సానరాతిమీద తేనెతో అరగదీసి ఆగంధమును మాటిమాటికి నాలుకకు రాయుచుండవచ్చును.''

3. శరీరమునకు ఉష్ణముకలిగించుట.

ఉష్ణముకలిగించుటకుచికిత్స.

కర్పూరతైలముగాని సారా మొదలగు ఇతర ద్రావకములుగాని క్లోరోఫారముగాని శరీరమంత

టను మెల్లగా మర్దనచేయవచ్చును. కాళ్లుచేతు లు చలవలు క్రమ్మినప్పుడు శరీరమునకు ఉష్ణము పుట్టించు ప్రయత్నములు చేయవలెను. వెచ్చని కంబళి దుప్పట్లతో రోగిని కప్పియుంచి వేడి నీళ్ల సీసాలతో శరీరమంతయు కాచవలెను. తవుడుగాని ఇటుకపొడుముగాని వెచ్చజేసి, గుడ్డసంచులలోవేసి పొత్తికడుపు మీదను ప్రక్కలయందును కాచవలెను. ప్రశస్తమయిన విస్కిగాని బ్రాందిగాని మోతాదుఒక్కంటికి అరఅవున్సు మొదలు 2 అవున్సులవరకు అరపోలెడు మంచినీళ్లతో చేర్చి ఇయ్యవలెను. కస్తూరిని 2 మొదలు 5 గురిగింజల యెత్తువరకు ఒక్కొక మోతాదు చొప్పున గంట గంటకు ఇయ్యవచ్చును.

ఉష్ణము కలిగించుటకు గోపాలాచార్యులువారి ప్రయోగములు.

ఆయుర్వేదీయ చికిత్స.

"కస్తూరిని అర గురిగింజఎత్తు మొదలు ఒక గురిగింజవరకును వ్యాధిబలము ననుసరించి ప్రతి కాల గంట కొకతూరిగాని, అరగంట కొకతూరిగాని రెండు ఉద్ధరిణల చనుబాలతో కలిపి ఇయ్యవలెను. లేక బ్రాందితోగాని సారాయితోగాని కలిపి ఇచ్చుట మంచిది. చలవలు తగ్గును. నాడికి బలముకలుగును. కాళ్లకును చేతులకును శరీర మంతటకును

చలవలు తగ్గుటకు వెలిబూడిద,ఆవపిండి పసుపుపొ
డి,వీనిని ఒక్కొక దానినిగాని కొన్నిటినిగాని చేర్చి
అందుహారతి కర్పూరమును పొడిచేసి కొంచెముచే
ర్చి పైన రుద్దవలెను. కర్పూరతైలమును ఉడుకులా
మును పైన రుద్దవచ్చును. వెల్లుల్లిపాయలను చ
క్కగా ఒలిచి మెత్తగా నూరి కాళ్లకుచేతులకు పూ
యవచ్చును. ములగచెక్క పసుపు మెత్తగా పొడి
చేసి ఒంటికిరుద్దిన చలవలు తగ్గును. రోగిని మంచి
కంబళ్లతో కప్పి యుంచవలెను. ఈ చలవలస్థితి
లో పైనిజెప్పిన కస్తూరిగ్రహణి మాత్రలనుపయో
గించుట అత్యుత్తమము. దీనివలన నాడికి బలము క
లుగును. చలవలు గప్పినప్పుడు నాడి బలహీనమగు
టయు మూత్రము తగ్గుటయు విరేచనములు వాం
తులు లేక పోవుటయు గలస్థితిలో నల్లమందుచేరి
న మందులను ఏమాత్రమును ప్రమాద వశముచేత
కూడ ఇయ్యకూడదు.

కుంకుమ పువ్వు; శుద్ధిచేసిన వత్సనాభి; మిరి
యాలు,జున్ను; పావుదారు; గోరోజనము; కస్తూరి;
ఇవి సమభాగములుగ తెచ్చి కల్వములోవేసి చి
త్రమూలము రసముతో మెత్తగా రెండు మూడు
దినములునూరి కందిగింజలవలె మాత్రలు చేసి నీడ
లో ఆరబెట్టి సీసాలో భద్రపరచవలెను. దీనినే " క

స్ఫూరి భైరవము " అని మా వైద్యశాలయందు వాడుదుము. నాడి బలహీనమై అతి చెమటలు గలిగి మిక్కిలి బలహీనముగ నున్నపుడు ప్రతి కాలగంటకుగాని అరగంటకుగాని రెండు మాత్రలుచొప్పున, వేడియు నాడికి బలమును కలుగువరకు నియ్యవలెను."

లైకరుస్ట్రిక్నీను (Liquor Strychnine) టించరు డిజిటాలిసు (Tincture Digitalis) అనుమందులు కూడ వాతపుదశలో మిక్కిలి ఉపయుక్తములు. వీని మోతాదు 5 మొదలు 10 చుక్కలు. అనుపానము గ్రుక్కెడు మంచినీళ్లు. శరీరము మిక్కిలి చలవలు క్రమ్మినయెడల 103 లేక 105 డిగ్రీలవరకు నుండెడు అనగా కొంచెము వెచ్చని వేడినీళ్లలో రోగిని తలవరకుముంచి పరుండబెట్టుటవలన అనేకసార్లు గుణము కలిగినది. దీనివలన విరేచనములు మొదట కట్టకపోయినను వాంతులును ఎక్కిళ్లును తగ్గి, నాడిస్ఫుటపడి హరించిపోయినమాత్రము తిరిగి స్ఫురించును.

రోగిని వేడినీళ్లలో ముంచుట.

4. చిక్కబడిననెత్తురుటిని పలుచన చేయుట.

మిక్కిలి శీతలము క్రమ్మినరోగులకు సహితము 20 ఔన్సులు కాగిచల్లారిన నీళ్లకు 60 *గ్రెయినుల ఉప్పునుచేర్చి ఆనీళ్లను గోరువెచ్చగ నెత్తురులోనికి పిచికారీచేయుటవలన గుణము కనబడవచ్చును. కా

* గ్రెయిను అనగా గురిగింజలో సగము ఎత్తు లేక రెండువడ్లగింజలయెత్తు.

ని సర్వసాధారణముగా నది యెంత యుపయోగమో చెప్ప జాలము. జీవించునను ఆశబొత్తుగా లేని రోగులకు ఈ వైద్యము చేసిచూచుట మంచిది. విరేచనములధికముగా నున్నప్పుడు మనమెంత నీరు నెత్తురులోని కెక్కించినను వెంటనే ఆనీరంతయు పేగులలోనికీడ్వబడి ఆసనమార్గమునపోవును.

5. నీరసించిన గుండెలకు బలమునిచ్చుట.

నాడిబలపరచుట. నాడి మిక్కిలి నీరసముగా నున్నప్పుడు పైనిచెప్పిన ప్రకారము బ్రాందిని అరఅవున్సు మోతాదు లచొప్పున గంటగంటకు ఇయ్యవలెను. స్ట్రిక్నీన్ అను మందును 5 మొదలు 10 చుక్కలుచొప్పున మంచినీళ్లతో ఇయ్యవలెను. లేదా నెత్తురులోనికి పిచికారీ చేయవలెను.

6. కాళ్లతీపులు నివారింపుట.

కాళ్ళతీపులకు చికిత్స. నల్లమందు కొంతవరకు దీనికిపనిచేయవచ్చును. మిక్కిలి బాధగానున్నయెడల మార్ఫియా పాతిక మొదలు అరగ్రెయినువరకు నెత్తురులోనికి పిచికారీ చేయవచ్చును. కర్పూరతైలము వగయిరా వేడిపుట్టించు మందులను మర్దనచేయవచ్చును. కాళ్లుపిసుకవచ్చును. కాళ్లయొక్కయు చేతులయొక్కయుపై భాగములయందు గుడ్డలతో బిగించి కట్టవచ్చును. కా

ని క్రిందిభాగమునందు బొ_త్తిగ నెత్తురుక్షీణించిపోకుం డ అప్పుడప్పుడుఈకట్లు విప్పితిరిగికట్టుచుండవలెను.

"మడమలయందు సూదితోగాని, దబ్బనము తోగాని రక్షవేయుటశాస్త్రమున నుదాహరించిన ట్లు అనేక దేశీయ వైద్యులుకూడ చేయుచున్నా రు. ఈక్రియ ఉపయోగకరమైన దైనను క్రూరమై నదిగాన సుకుమారి దేహుల విషయమై వైద్య వరులు యోచింపతగినదిగా నున్నది."

7. హరించిపోయిన మూత్రమును
తిరిగి స్రవింపజేయుట.

మూత్రము సరిగా స్రవింపనియెడల నల్లమందు ఉపయోగింపకూడదు. పలుచని బార్లీగంజి నీళ్లు సోడా లెమినేడు మొదలగు పొంగునీళ్లు ధారాళము గానీయవచ్చును. పొ_త్తికడుపుమీాద వెచ్చ వెచ్చగ కాచుటచే మూత్రము శీఘ్రముగ స్రవింపవచ్చును. మూత్రము.

స్పిరిట్సు ఈథరిస్ నయిట్రోసి (Spirits aetheris Nitrosi) అనుమందును 20 మొదలు 40 చుక్కల వరకుచాలనీళ్లలో కలిపిత్రాగుటకిచ్చినయెడల మూ త్రముత్వరలో స్రవించును. సూరేకారము 2 మొద లు 10 గురిగింజల యెత్తువరకు అరసోలెడు నీళ్లలో కలిపి రెండుగంటలకొకతూరి మూత్రము స్రవించు వరకు నీయవచ్చును.

గోపాలా చార్యులవారు ఇట్లు వ్రాయుచున్నారు.

"మూత్రము తగ్గినసమయమున నల్లమందు చేరి నమందులను ఏమాత్రము ఉపయోగింప కూడదు. లేవల చిన్ని, సూరేకారము, బ్రాందితోగాని సారాయితో గాని నీటితోగాని, మెత్తగా అరగదీసి పొత్తి కడుపునకు గంట గంటకు పట్టు వేయవలెను. ప్రతితడవను, పాతపట్టు తీసివేసి క్రొత్తది వేయుచుండవలెను. సూరేకారమును తెల్లగలిజేరును కొంచెముకొంచెము వేసి నీళ్లుబోసి బాగుగా పొంగువచ్చునటుల కాచి ఆ నీటిలో కంబళి బట్టతడపి, నీటినిపిండి ఆవిరిగల ఆ కంబళి బట్టను పొత్తి కడుపుమీద వేసి కాచవలెను. ఇట్లు ఆవిరి ఆరినతోడనే తిరిగి దానిని వేడినీళ్లలో అద్ది మూత్రము వచ్చువరకు కాపువేయుచుండవలెను.

సుప్రసిద్ధమగు వైద్యచింతామణి యందలి శంఖ ద్రావకము క్షౌరద్రావకమను ద్రావకములను 10 బొట్లు ఒక గ్రుక్కెడు నీళ్లలో కలిపి ప్రతి ఒక గంటకు మూత్రము వచ్చువరకు ఈయవచ్చును. వీనిలో క్షౌరద్రావకము మంచిదని నామతము."

ఉష్ణదశ. మూడవ దశలో శరీరములో ఉష్ణముఅధికమయ్యెనేని రోగికిచల్లగనుండునట్లు చేయవలెను. విరే

చనమింకను కట్టనియెడల నల్లమందు కలిసిన మందు లను కరక్కాయ మాఫలకాయమొదలగు వగరు పదార్థములు కలిసిన మందులను ఇయ్యవచ్చును.

చికిత్సయందలి ముఖ్యాంశము లేవియనగా:—

చికిత్సయందలిముఖ్యాంశములు.

1. రోగి మొట్టమొదట వైద్యునివద్దకు వచ్చిన యెడల వగరుగల మందులనిచ్చి విరేచనములు కట్టునట్లు చేయవలెను. అట్టిమందులన్నిటిలోను పైని 70 వ-పుటలో వ్రాయబడిన కవిరి ద్రావకముగల మందు మిక్కిలి యుపయుక్తము.

2. దీనివలన విరేచనములు కట్టకపోయినను లేక రోగి మొదటి దశదాటిన తరువాత వైద్యునివద్దకువచ్చినప్పుడును నోటిమార్గమున చిన్న చిన్న మోతాదులుగా రసభస్మమునియ్యవలెను. ఆసనమార్గమున టానిక్ ఆసిడ్డును ఇయ్యవచ్చును.

3. రోగికి కాళ్లుచేతులు చల్లబడి వాతపుస్థితిలో నుండుట తటస్థించినయెడల రోగినివేడి నీళ్లలో ముంచవలెను. లేదా వేడినీళ్ల సీసాలతో కాచుచు, వేడిదుప్పట్లు కప్పి వేడిపుట్టునట్లు తైలములను మర్దనచేయవలెను. ఈ స్థితిలో బ్రాందినిగాని, లైకరుస్ట్రిక్నీనుగాని లోపలి కియ్యవలెను. లేదా నెత్తురులోనికి పిచికారీచేసి శరీరములోనిఉష్ణమును కాపాడవలెను.

8 పథ్యము.

పథ్యము. కలరా తగిలినరోగికి వాంతులు అధికముగా నుండుటచేత ఆహారమేమియు ఇమడనే ఇమడదు. ఒకవేళ ఇమిడినను జీర్ణమగుటకష్టము. కావునవ్యాధియొక్క ఉగ్రతము అణగువరకు ఆహారము ఏమియును ఈయకుండుట ఉత్తమము. దాహమైనచో కాగిచల్లారిననీళ్లు కొంచెము కొంచెముగాగాని, జీలకర్ర వేసికాచిననీళ్లుగాని, సోడామొదలగు పొంగు నీళ్లుగాని ఇయ్యవచ్చును. వ్యాధికొంచెములొంగినతరువాత చిట్టుడుకు నీళ్లుగాని, వరిపేలాలువేయించి ఆపేలాలు వేసికాచివడపోసిననీళ్లుగాని, సమభాగములుగా నీళ్లుకలిపి కాచినపాలుగాని, ఈయవచ్చును. పాలుజీర్ణము కానియెడల పాలును సున్నపుతేటనీళ్లను సమభాగములుగాచేర్చి ఇయ్యవచ్చును. కొంచెముజీర్ణశక్తివచ్చినతరువాత, క్రమముగా నూకలజావ, గోధుమజావ, సగ్గుబియ్యపుజావ, మొదలగునవి, చారుతోను, పాలతోను, కలిపి ద్రవపదార్థములుగా ఒకటి రెండు దినములవరకు ఇచ్చుటమంచిది. పచ్చళ్లను, ఊరుగాయలను కొంచెము కొంచెముగా నంచుకొనుట కీయవచ్చును. మెల్లిన్సు ఆహారము, డబ్బాపాలు మొదలగు

నవి కాచిననీళ్ళతో చేర్చి ఈయవచ్చును. ఇవి పాల కంటె చిక్కగనుండునట్లు తయారుచేయకూడదు.

ఒకఇంటిలో నొకమనుష్యునకు కలరాతగిలినదని తెలియగనే ఇంటిలోనివారలు చేయవలసిన పనియేమనగా:—

1. వ్యాధిని రహస్యముగా దాచిపెట్టక తక్షణమే వైద్యునకు కబురుపంపుట.

వ్యాధినిదాచిపెట్టకుండుట.

2. సాధ్యమగునని తోచినచో రోగినితక్షణమే, ఆసుపత్రికి పంపుటమంచిది. రోగిపక్షమున ఆలోచించిన యెడల, వైద్యమక్కడ చక్కగా జరుగును. వైద్యులుదగ్గరఉండి చక్కగాచూచుచుందురు. తగిన నౌకర్లుమొదలగువారు ఏర్పడియుందురు. రోగియొక్క బంధువులవిషయమై ఆలోచించినట్లయిన, సాధారణముగా మనదేశములో వాడుకప్రకారము ఒకరిఇంటిలో వ్యాధివచ్చినదనగానే, స్నేహితులును, బంధువులును, అందరునుచూచుటకువచ్చెదరు. అసలే రోగియొక్క సంరక్షణవిషయమై చూచుకొనుటకే ఇంటిలోనివారలకు కష్టము. దానితోపాటు ఇంటికివచ్చిన బంధువులకు, అనగా వియ్యాలవారికి, బావమరుదులు వగైరాలకు, భోజనసదుపాయములు చూడవలెను. ఇవి అన్నియు చేయువారలా యింటిలో సాధారణముగా ఒక్కరు

రోగినిఆసుపత్రికిపంపుట.

గానేయుందురు. అట్టిసమయములో ఒక్కొకనాడుఇం టిలో భోజనములే లేక, ఇంటికివచ్చినవారలందరును మాడుచుందురు. ఒకవేళదొరికినను వేళతప్పిన భోజ నమే దొరుకును. దానికితోడుగా, నౌకరిచేయు నౌ కర్లుమొదలగువారలు రోగివద్దనుండి తెచ్చినమయి లను ఇంటిలో కలపకుండుట దుర్లభము. ఇందుచే బంధువులకుగూడ అంటువ్యాధి సంభవించుటకును, వారిగుండ ఈవ్యాధి ఊరు, ఊరునకు వ్యాపించు టకును, కారణమగును.

కావున ఆసుపత్రికి పంపుట రోగికిని, బంధువుల కును, స్నేహితులకును, కూడ ఉత్తమము. ఒకవేళ రోగి మిక్కిలి భాగ్యవంతుడయియుండి, వైద్యులను తనయింటికే పిలిపించుకొనతగిన సామర్థ్యముకలవా డైనప్పుడును, గ్రామములో ఆసుపత్రిలేనప్పుడును, కలరా మయిలను ఇంటిలో కలపకుండ చేయుటకు ఈక్రిందిఏర్పాటులను గమనింపవలెను.

గదిప్రత్యేక ముగానుం చుట.

1. రోగినిప్రత్యేకముగా నొకగదిలో నుంచవ లెను. ఆగదిలోనుండు అనవసరమైన సామానుల ను బట్టలను, ముందుగా తీసివేయవలెను.

మందునీళ్ళ లోతడిపిన తెరకట్టుట.

2. ఒకదుప్పటిని కార్బాలికు మందునీళ్లలోగాని సావీరవు మందునీళ్లలోగాని, తడిపి ఆగదియొక్క గుమ్మమునకు అడ్డముగా తెరవలెవ్రేల్లాడగట్టవలెను.

ఏలయనగా ఈమార్గమున ఆగదిలోనుండి వెలపల కు మయిల పోజాలదు. ఇదిగాక ఇతరులెవరును ఆ గదిలోనికి పోగూడదని తెలియజేయుటకీ తెర గురుతుగానుండును.

3. ఆ గదియొక్క కిటికీలన్నియు తెరిచియుంచవలెను. కిటికీలు తెరచుట.

4. రోగికి సేవ చేయుటకు ఎవరినో ఒకరి నిద్దరిని ప్రత్యేకముగా నేర్పరచవలెను. వారలు ఇతరుల నెంతమాత్రమును తాకకూడదు. వారలు వేసికొనుబట్టలు ఉతికి ఆరవేసికొనుటకు వీలయినవిగా నుండవలెను. రోగికి నౌకరీచేయువారలు నివసించుటకు ప్రత్యేకము ఒకస్థలము ఏర్పాటుగా నుండవలెను. వారల బట్టలు ఇతరుల బట్టలతో కలిపివేయకూడదు. ఆబట్టలను వారల పనితీరినతోడనే పైని జెప్పినమందునీళ్లలో వేసి, కొంతసేపుంచిన తరువాత ఉడకబెట్టవలెను. వారుభోజనము చేయకె పూర్వము చేతులను మందునీళ్లలో 5 నిమిషములకు తక్కువకాకుండ ముంచియుంచవలెను. సేవకులను ప్రత్యేకముగానుంచుట.

5. రోగిని చూచుటకు వచ్చువారల నెవ్వరిని గదిలోనికి రానియ్యకూడదు. మిక్కిలి అవసరమైనచో తెర ఈవలనుండి మాట్లాడవలెను. లేదా కిటికీలగుండమాట్లాడవలెను. ఇంటిలోని పిల్లలను బడి రాకపోకల నాపుట.

కిపోయి ఇతరుల పిల్లలతో కలియనీయ కూడదు.

విరేచనముల ను వాంతుల ను పూడ్చుట.

6. రోగియొక్క విరేచనములను వాంతులను మందునీళ్లుగల తొట్టెలలో పోసిపెట్టి త్వరలోనే గోతులుతీసి ఆగోతులలో పూడ్చివేయవలెను. రంపపు పొట్టుతో కలిపి కాల్చివేసినను కాల్చవచ్చును. కాని పల్లెటూళ్లలో చేయునట్లు నడి వీధులలోవేసి ఊరందరికి కలరా వ్యాపించునట్లు చేయరాదు.

రోగిబట్టలను డక వేయుట.

7. రోగి పాడుచేసినబట్టలను మందునీళ్లలోవేసి పెట్టి పిమ్మట ఉడకవేయవలెను.

స్నానము.

8. రోగిని, రోగము నెమ్మదించిన వెంటనే, మందునీళ్లలో స్నానము చేయించవలెను. లేదా మందునీళ్లగుడ్డలతో శరీరమంతయు చక్కగ తుడిచివేయవలెను.

గదిశుద్ధిచేయుట.

9. రోగి గదినివిడిచిన తరువాత దానిగోడలను, నేలను, చక్కగ మందునీళ్లతోకడిగి వేయవలెను. గంధకము మొదలగునవి పొగవేసినను మంచిదే. తరువాత ఆగదికి సున్నము వేయించవలయును.

రోగివిడిచిన ఆహారాదులు.

10. రోగి విడిచిన ఆహారాదులన్ను ఇతరులను తిననీయరాదు. కాల్చివేయవలెను. లేదా మందునీళ్లతో కలిపిగోతులలో పూడ్చివేయవలెను.

రోగిమరణాంతరము.

11. రోగి చనిపోయినయెడల వానిశరీరమును మందునీళ్లలోతడిపిన దుప్పటిచే కప్పియుంచవలెను.

సాధ్యమయినంత త్వరలో దహనాదులు చేయవ లెను. ఇంటిలోనివారలందరును అంగీకరించి వైద్యు నకు సహాయముచేసినను పైనిచెప్పిన విధులన్నియు గమనించుట కష్టము. కావునరోగిని ఆసుపత్రికిపం పుటకు వైద్యుడు ప్రోత్సాహము చేయువలెను. అది సాగనియెడల "లేని బావకంటె గ్రుడ్డిబావమేల నునట్లు" సాధ్యమైనంతవరకు మైలను వ్యాపింప కుండ జేయుట వైద్యుని విధియైయున్నది.

వ్యాధిని వ్యాపింపకుండ చేయుటకై జ్ఞాపక ముంచుకొనవలసిన యితర జాగ్రతలు.

వ్యాధిని ప్రచురపరచుట.

1. కలరా అంకురించినదను అనుమానము కలి గిన తోడనే, ఆసమాచారమును రోగియొక్క బం ధువుడుగాని ఆరోగి నివసించు ఇంటిలోని ఇతరుడె వ్వడయిననుగాని, వైద్యుడుగాని, చిన్నగ్రామమైన చో గ్రామమునసబునకును, పట్టణమైనచో మునిసి పాలు ఉద్యోగస్థులకును తెలియపరచవలెను. గ్రా మమునసబు ఆ సంగతిని తక్షణమే తహశ్శీలుదారు నకు తెలియపరచవలెను. అట్లు చేయనివారలకు కఠినమయిన శిక్షవిధింపవలెను. సర్కారువారు వెం టనే అట్టి స్థలములకు తగిన వైద్యుని పంపుదురు.

నీటియొక్క పరిశుభ్రత.

2. నీటియందు మైల చేరకుండ చూచుకొనవలె ను. కలరాయొక్క అనుమానము స్ఫురించినతోడనే గ్రామములో అందరును నీటిని కాచి త్రాగవలెను.

వీధులు, దొడ్లు శుభ్రపఱచుట.

3. వీధులయందును, ఇంటిదొడ్లయందునుండు పెంటలు మురుగుకుండ్లు మొదలగునవి శుభ్రముగా నుంచుకొనవలెను.

మితాహారము

4. మితముగ భోజనముచేయవలెను; పచ్చికాయలుగాని మాగి పోయిన కాయలుగాని తినకూడదు. చెడిపోయిన మాంసము చేపలు మొదలగునవి విసర్జింపవలెను.

పాలు పెరుగులను మయిలపడకుండనుంచుకొనుట.

5. అన్నముగాని ఇతర ఆహార పదార్థములు కాని చల్లారినవానిని తినకూడదు. పాలకు ఎట్టిమయిలయును సోకకుండ జాగ్రత పెట్టవలెను. ముఖ్యముగా మనదేశములో, పాలలోను పెరుగులోను నీళ్లు కలపకుండ అమ్మనే అమ్మరు. అట్లుకలిపెడు నీళ్లలోకూడ పరిశుభ్రమయిన నీళ్లయినను కలపరు. అమ్మెడు వారలు తక్కువజాతిలోని బుద్ధిహీనులగుట చేత ఎట్టి బురదనీళ్లనయినను చేర్చుదురు. నీళ్లు సమయమునకు దొరకనిచో బట్టపిడుపు నీళ్లను కలుపుదురు. అదిగాక వారియొక్క మడ్డిచేతులను మాటిమాటికి కుండలలో ముంచుచు కెలుకుచుండెడు గొల్లవాండ్రను చూచునప్పు డెల్లరకును, అసహ్యమును అంటువ్యాధుల భయమును, గలుగకమానదు. కావున తగిన జాగ్రతతో కాచిన పాలును, అట్టి పాలనుండి తయారుచేయబడిన పెరుగు మజ్జిగలుతప్ప ఇతరములను నిషేధింపవలయును.

6. పెండ్లిండ్లు మొదలగు ఉత్సవములు మానుకొ ఉత్సవాదుల నవలెను. జనసంఘములు చేరు యాత్రా స్థలముల మానుకొనుట. లో పరిశుభ్రమైన మంచినీరు దొరుకునట్లు సర్కా-రువారు తగినయేర్పాటులను చేయవలెను. అక్క-డక్కడ మరుగుదొడ్లను కట్టించి వానిని తరుచుగ శుభ్రపరిపించుట సర్కారువారి విధిఅయియున్నది. వానిని జాగ్రతగా నుపయోగపరచుకొనుట ప్రజల విధి అయియున్నది. కలరావ్యాధిసోకినతోడనే రోగియొక్క బంధువులు ఆసంగతిని దాచుకొనక, సర్కారు ఉద్యోగస్తులకు తెలియపర్చవలెను. తక్షణము అట్టివారిని, వారికొరకై, ప్రత్యేకముగా నిర్మింపబడిన పాకలలో బెట్టి, వారికి తగిన చికిత్స సర్కారువారు చేయవలెను. ఇట్టిఏర్పాటులు పుణ్యక్షేత్రములలోనేగాక, ప్రయాణీకులు మజిలీలు చేయు చుండు సత్రములలోకూడ చేయవలెను. సర్కారు నౌకర్లు ప్రజలను నిర్బంధపెట్టి, బెదిరింపక వారలకు చక్కగబోధించి వారి సౌఖ్యముకొరకే యేర్పాటులన్నియు చేయబడుచున్నవని నచ్చజెప్పవలెను. లేనిచో ప్రజలీవ్యాధులను రహస్యముగాదాచిపెట్టి వ్యాధిని వ్యాపింపజేయుటయేగాక, సర్కారు నవుకర్లుజేయు ప్రతిపనికి అడ్డమువచ్చు

చుందురు. పైగా తెలివిమాలిన ప్రజలను రెచ్చబె ట్టిన వారు తమ లాభ నష్టములను తెలిసికొన లేక, తమకేదియో అపాయమువచ్చునని భయపడి సర్కారునవుకర్లకు హానికలుగజేయుదురు. ఇట్టి స్థలములలో నట్టిప్రజలబలగము సర్కారు నవుకరుల యొక్కబలగము కంటె నెక్కువగనుండుటచేతను, భక్తియను మూఢవిశ్వాసము, యాత్రపరుల కావేశమును కలిగించుటచేతను, పోట్లాటకును, దొమ్మీలకును అవకాశముగలుగుచుంటను.

వ్యాసములును వ్రాసి పంచిపెట్టుట.

7. కావున ప్రజలసౌఖ్యమును, తమసౌఖ్యమును గోరుసర్కారు నవుకరులందరును, ఎంతశ్రమపడి యయినను ఒక్కొకఅంశమును ప్రజలకు వివరముగ బోధింపవలెను. ఇందులకై వారు చేయుపనులయొక్క ఉపయోగములను తెలుపుచు చిన్నచిన్నవ్యాసములవ్రాసి అచ్చువేయించి ప్రజలకు పంచిపెట్టి వారలకు జ్ఞానాభివృద్ధిచేయవలెను.



# విజ్ఞానచంద్రికా గ్రంథమాల.

ఈ పేరుతో సంవత్సరమునకు **నాలుగు** వచన గ్రంథములు ప్రకటింపఁబడును. ఈ గ్రంథముల ఖ్యాతి తెలుఁగుదేశమునందు అంతటను వ్యాపించి యున్నది. రాజులు, మహారాజులు, గొప్పవారలు, పాఠశాలాధికారులు, సామాన్యజనులు అందరు ఈ పుస్తకములను ఆదరించుచున్నారు. బొబ్బిలి, పిఠాపురము, మునగాల రాజులు ఈగ్రంథములకు రాజపోషకులు.

## ఉద్దేశ్యము.

ఇంగ్లీషు రానివారికి ఆ భాషలోఁగల జ్ఞానమంతయు తెలుఁగు మూలమున నేర్పుట యీగ్రంథమాల యుద్దేశము. ఇందు మనపూర్వుల నిజమైన వృత్తాంతము, దేశదేశచరిత్రలు, ప్రకృతిశాస్త్రములు, చరిత్రవిషయకనవలలు, మహాపురుషుల జీవితములు, ఇంగ్లీషులోని ఉద్గ్రంథముల భాషాంతరీకరణములు, ప్రకటింపఁబడును. కావ్యనాటకాదు లిందుండవు.

## మా గ్రంథములు.

ఈ గ్రంథమాలలోని గ్రంథములన్నియు జ్ఞానదాయకములు. అపూర్వము లయినవి. తెలుఁగుభాషలో నింతవర కెవ్వరును రచించియుండలేదు. ఇవి మేమనుమాటలు గావు. అనేకు లీరీతిగ పొగడియున్నారు. ఎవ్వరేశాస్త్రమునందు ప్రవీణులో అట్టి తద్జ్ఞులచే నీగ్రంథములు వ్రాయఁబడును. ఒకగ్రంథపఠనమువలన అనేకగ్రంథములలోని విషయములు సులభముగాఁ దెలిసికొనవచ్చును. స్త్రీలు పామరులుకూడ విషయము బోధపరుచుకొనునట్లు చక్కని ధారాళమైన శైలిలో వ్రాయఁబడును. చక్కని వచన రచన నేర్చుకొనుటకీ గ్రంథము లెక్కుడు సాయకారులు. ఆయావిషయములకు సంబంధించిన పటములు, చిత్రపటములు, రంగులపటములు పెక్కులుండును. సీమనుండి ప్రత్యేకముగాఁ దెప్పించిన క్యాలికోతో మిక్కిలి మనోహరముగా బైండు చేయఁబడును. నునుపైనట్టి దళసరికాగితములపై ముత్యములవరుసవలె అచ్చువేయఁబడును. ఏగ్రంథము చూచినను ముద్దులుమూటఁగట్టుచుండును. తెలుఁగుభాషలో సర్వాంగసుందరమైన పుస్తకములు బయలుదేరుటకు మాగ్రంథములే మార్గదర్శకములు.

# శాశ్వతపు చందాదారులు.

ఈ గ్రంథములు అందరుకొనుటకు వీలగునట్లు తక్కువ వెలల కీయదలచి నారము. మా గ్రంథములన్నియు చవుకగా కావలయునేని మా గ్రంథమాలకు శాశ్వతపు చందాదారులగుటయే ఉత్తమము. శాశ్వతపు చందాదారులగు వారు మొదట చందా నీయనక్కరలేదు. వారు సంతకముచేసిపంపిన దరఖాస్తు అందగానె ఇదివరకు ప్రకటింపఁబడిన గ్రంథములలో నిలవయున్నవి వారికి వి. పి. గా పంపఁబడును. వానివెల రు. 3-0-0 లకు లోపుగానుండును. తరువాత క్రొత్తగ్రంథములు ఎప్పటికప్పుడు వీ. పీ. గా పంపఁబడును. చందాదారులకు మొత్తముమీద సంవత్సరమునకు రు. 3-0-0 కంటె నెక్కుడు కర్చు క్రొత్తగ్రంథముల నిమిత్తమై తగలనేరదు. చందాదారులగువారు మేము పంపిన వి. పి. లు తిరగకొట్టగూడదు. అట్లు తిరగకొట్టినవారివద్దనుండి గ్రంథముల పూరా వెలయు మాకగునష్టమును రాఁబట్టుకొనఁబడును. చందాదారులవద్దనుండి ప్రవేశరుసుము (entrance fee) క్రింద 0-4-0 లు రాఁబట్టుకొనఁబడును. ఇదివరకు మేము ప్రకటించినగ్రంథములు అక్కరలేదనియు, ఇకమీద ప్రచురించుగ్రంథములే కొందుమనియు కోరు శాశ్వతపుచందాదారులు రు. 1-0-0 ప్రవేశరుసుముక్రింద నీయవలెను.

# శాశ్వతపు చందాదారులకు లాభములు.

పోస్టేజికర్చులు తగులనేరవు. వి. పి. కర్చులు తగులనేరవు. బైండింగు కర్చులు తగులనేరవు. ఇతరులకులేని ఈ సౌకర్యములు చందాదారులకు ఉండుటయేగాక ఇతరులకు 0-6-0 కిచ్చు 100 పుటలగ్రంథము వీరికి 0-4-0 కే ఈయఁబడును. కావున వెంటనే చందాదారులగువారికి ఈలాభములన్నియు కలుగును. చందాదారులసంఖ్య 3000 లకు మించినతరువాత వచ్చెడి చందాదారులకు ఈవీల్లు ఉండనేరవు. ఇంతకన్న తక్కువ వెలకు గ్రంథములిచ్చువారు ఆంధ్రదేశము నందెచ్చటను లేరని పంతముతోఁ జెప్పగలము.

ఆ. లక్ష్మీపతి, బి. ఎ. ఎం. బి. సి. ఎం.,

మేనేజరు, విజ్ఞానచంద్రిక.

చింతాద్రిపేట మద్రాసు

## ఇదివరకు ప్రకటింపఁబడిన గ్రంథములు.

**1.** ఆబ్రహాములింకను చరిత్ర :— ప్రతులు లేవు.

**2** హిందూమహాయుగము :— ఇందు మిక్కిలి పురాతనకాలము నుండి మహమ్మదీయ ప్రభుత్వమువరకు జరిగిన హిందూదేశ చరిత్రమంతయు వ్రాయఁబడినది. ఆర్యభూసత్పుత్రుల నేకులు వారివారికాలములందు హూణ (Huns) శక, యవనాది శత్రురాజుల నోడించి శాశ్వతకీర్తి చెందిన సంగతు లీగ్రంథములో నెంతయు వీరరసపూరితముగ వర్ణింపఁబడినవి. ఇది అద్వితీయ గ్రంథమనియు, ఇతరభాషలలోనికి భాషాంతరము చేయవలసినంతటి యోగ్యత కలదనియు విద్వాంసులు పొగడియున్నారు. నాలుగవకూర్పు అగుచున్నది. 250 పుటలు. 15 పటములు. క్యాలికోబైండు. మా చందాదారులకు పోస్టేజితో 0-11-0, ఇతరులకు పోస్టేజికాక రు. 1-0-0. శ్రీయుత కె. వి. లక్ష్మణరావు ఎం. ఏ., గారి విరచితము.

**3.** జీవశాస్త్రము :—(Biology) శ్రీయుత లక్ష్మీపతి, బి. ఎ. ఎం.బి.సి.ఎం., గారిచే వ్రాయఁబడినది. ఇందు జంతుశాస్త్రము, వృక్షశాస్త్రమునకు సంబంధించిన విషయము లెన్నియో తేట తెలుగుమాటలతో వర్ణించఁబడినవి. 400 పుటలు. 75 పటములు. క్యాలికోబైండు. చందాదారులకు అంచెకూలితో 1-0-0. ఇతరులకు అంచెకూలిగాక రు. 1-8-0.

**4.** మహమ్మదీయ మహాయుగము:— ఇది హిందూదేశ చరిత్ర యొక్క రెండవభాగము. ఇందు ఆఫ్గానుల రాజ్యము, మొగలుప్రభుత్వము, రాజపుత్రుల శౌర్యాగ్ని, విజయనగర సామ్రాజ్యము, బహమనీరాజ్యములు, అత్యంతరసవంతముగ వర్ణింపఁబడినవి. అక్బరు, ప్రతాప్, కృష్ణదేవరాయ, అక్కన్న మాదన్న మొదలగు మహాపురుషుల జీవితములు పఠనీయములు. శ్రీయుత కె. వి. లక్ష్మణరావు ఎం.ఏ., గారిచే రచింపఁబడినది. 450 పుటలు. 60 పటములు. రెండవకూర్పు. మాచందాదారులకు పోస్టేజితో రు. 1-2-0లు. ఇతరులకు పోస్టేజికాక రు. 1-8-0 లు.

---

మేనేజరు, విజ్ఞానచంద్రిక. చింతాద్రిపేట, మద్రాసు.

అద్భుతమైన నవల. క్యాలికోబైండు.

# రాణీ సంయుక్త.

ఇదియొక చరిత్రవిషయకనవల. పృథ్వీరాజు యొక్కయు, సంయుక్త యొక్కయు, దేశాభిమానము, పరాక్రమము, ఎంతయు రసవంతముగా వర్ణింపఁబడినవి. హిందూసామ్రాజ్య నాశనమునకు కారణములును, తురుష్కులీదేశము మొదటవచ్చినప్పు డీదేశపుస్థితియు, నిందు చక్కగా వివరింపఁబడినవి. దీనినిజూచి నలుగురు గ్రంథకర్తలు నాలుగునాటకములను వ్రాసిరనునదియే దీనియోగ్యతను జాటుచున్నది. విద్వాంసులు, పత్రికాధిపతులుం దీనినెక్కువగా పొగడియున్నారు. 228 పుటలు. శ్రీయుత వేలాల సుబ్బారావు గారి ప్రణీతము. మాచందాదారులకు అంచెకూలితో 0-9-0. ఇతరులకు అంచెకూలిగాక 0-12-0 లు.

"కథ శౌర్యరసముతోను, శృంగారరసముతోను నిండి చదువుటకు మనోహరముగనుండును. నాయికానాయకులైన సంయుక్త పృథ్వీరాజుల దృఢానురాగమును సాహసకార్యములును నిగ్రహానుగ్రహములును, సంతోషవిభ్రాంతి భావములను జదువరులకుఁ గలిగించును. సంయుక్తకు గురువైన దేవశర్మ యొక్క ప్రజ్ఞాసాహసము లద్భుతములు. నవలను బ్రారంభించినవారలకు సాంతముగఁ జదువను గుతూహలముగలుగును. హిందూదేశమునందలి వనితాలోకమునుఁ బునరుద్ధారణచేయుట కాంగ్లేయుల పాలనమును భగవంతుఁడు ప్రసాదించినటులు దీనిని జదివినవారికిఁ దోఁపఁగలదు."

ఆంధ్రపత్రిక.

☞ మాకు 5 గురు చందాదారుల సంపాదించిన వారికి ఈగ్రంథము ఉచితముగా నీయఁబడును.

---

మేనేజరు, విజ్ఞానచంద్రిక, చింతాద్రిపేట, మద్రాసు.

**6.** పదార్థవిజ్ఞాన శాస్త్రము (Physics):—ఇందు రైలుబండ్లు నడుపువిధము, టిల్లిగ్రాం పోవువిధము, గిల్టుచేయుట మొదలగునవి తేట తెలుఁగుమాటలతో వర్ణింపఁబడినవి. స్కూల్సుకరిక్యులం ప్రకారము వ్రాయబడియున్నది. కావున స్కూలుమాస్టర్లకిది యెక్కువ యావశ్యకము. 380 పుటలు. 200 పటములు. క్యాలికో బైండు. శ్రీయుత ఎం. సాంబశివరావు, బి. ఎ. ఎల్. టి., గారిచే రచియింపఁబడినది. చందాదారులకు పోస్టేజిసహా 0-14-0. ఇతరులకు పోస్టేజికాక రు. 1-5-0.

**7.** రసాయనశాస్త్రము (Chemistry):—మనపూర్వులు బంగారము చేయవలయునన్న కోర్కెచే ఈశాస్త్రమును అభ్యసించిరి. జనులు లక్షాధీశులై దేశము ధనవంతమగుట కిట్టిపుస్తకములే యాధారములు. ఈ గ్రంథమునందు హిందూరసాయనశాస్త్రముయొక్క చరిత్రకూడ రసవంతముగ వ్రాయఁబడినది. 320 పుటలు 75 పటములు. క్యాలికో బైండు. గ్రంథకర్త శ్రీయుత వేమూరి విశ్వనాథశర్మ, బి. ఏ., గారు. మా చందాదారులకు పోస్టేజితో 0-13-0. ఇతరులకు పోస్టేజికాక రు. 1-4-0.

**8.** ఆంధ్రుల చరిత్ర (ప్రథమ భాగము):—ఐతరేయ బ్రాహ్మణకాలమునుండి క్రీ. శ. 1200 సంవత్సరములవఱకు అయిపోయిన యాంధ్రులనుగురించినచరిత్ర సవిస్తరముగనుండును. ఇందలి ప్రాచీనాంధ్ర దేశస్థితియు, ప్రాచీనాంధ్రులపౌరుషము, బుద్ధివైభవము మొదలగునవి ప్రత్యాంధ్రుఁడును చదివితీరవలె. విఖ్యాతాంధ్ర లేఖకులయిన శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారిచే రచియింపఁబడినది. 400 పుటలు. చక్కని క్యాలికోబైండు. మా చందాదారులకు పోస్టేజితో 1-0-0. ఇతరులకు పోస్టేజికాక రు. 1-4-0.

---

మేనేజరు, విజ్ఞానచంద్రిక, చింతాద్రిపేట, మద్రాసు.

క్రొత్తనవల! అత్యద్భుతమైననవల!! రంగుపటములుకలది!!!

# విమలాదేవి.

—:*:—

ఇది రాజపుత్రస్థాన చరిత్రవిషయక నవల. ఔరంగజేబునకుఁ బ్రతిస్పర్థియైన రాజసింహుని యొక్కయు, అతనిభార్యయగు విమలాదేవి యొక్కయు శౌర్యము, ధైర్యము, మతాభిమానము మొదలయిన విందుఁ జక్కఁగఁ బ్రదర్శింపఁబడినవి. ఔరంగజేబుయొక్క యంతఃపురములోని చిత్రవిచిత్రములయిన వ్యవహారములును, అతని పట్టమహిషియగు ఉదయపురికిని, చెల్లెలగు రోషనారు కునుగల మచ్చరమును, కాబూలు దేశమునకు భర్త వెంటఁబోయిన చంద్రావతి దేవియొక్క పవిత్ర చరిత్రమును, ఇందిరాదుర్గాదాసుల రాజభక్తియు, దేశరక్తియు, ధర్మాసక్తియు, గోలకొండ లోని యక్కన్నమాదన్న గారి వైభవమును, ఆబూ పర్వతముమీఁది యచలేశ్వర మందిరములోనున్న వైకుంఠ యోగి చేసిన యద్భుతకృత్యములును మిక్కిలి రమ్యముగ వర్ణింపఁబడినవి. కథాసందర్భము (Plot) అత్యద్భుతము. ఖయిబర్ కనుమ, ఆరావలీపర్వతారణ్యశోభ మొదలయిన వర్ణనలు అశ్రుతపూర్వములు. 320 పుటలు. ఇందు వర్ణనలను అనుసరించిన హాఫ్‌టోన్ పటములు, గొన్ని పెక్కురంగులతో నిజమైన మనుష్యులవలెనే యుండునట్టి పటములు ఉండును. ఇట్టి సర్వాంగ సుందరమైననవల యిదివరకు తెలుఁగులో బ్రకటింపఁబడలేదని చెప్పవచ్చును

ఇది శ్రీయుత బాలకవి భోగరాజు నారాయణమూర్తిగారిచే రచింపఁబడినది.

| | | |
|---|---|---|
| చందాదారులకు అంచెకూలితో | ... ... | 0 13 0 |
| ఇతరులకు అంచెకూలిగాక | ... ... | 1 2 0 |

మేనేజరు, విజ్ఞానచంద్రిక, చింతాద్రిపేట, మద్రాసు.

# కలరా.

విషూచియని మనవారలు బిలుచు కలరా జాడ్యము రోజుకురోజు మన దేశమునందు వ్యాపించి అనేకప్రాణముల హరించుచున్నందున, సాధ్యమయినంతవరకు నీమృత్యుదేవత బారినుండి తప్పించుకొందురుగాక యని ఈచిన్నపొత్తము శ్రీయుత ఆ. లక్ష్మిపతి, బి. ఎ, ఎం. బి. సి, ఎంగారిచే రచింపఁబడినది. ఇందు కలరా వ్యాపించు విధము, దాని నడ్డగించు మార్గములు, చికిత్స అను మూడుప్రకరణములు గలవు. ఇందలి అంశములు సోదాహరణపూర్వకముగా అనుభవమును బట్టియు, వైద్యశాస్త్ర పారీణుల గ్రంథములనుబట్టియు, ఎత్తి వ్రాయఁబడినవి. ఆయుర్వేద శాస్త్రప్రకారము, ఇంగ్లీషు వైద్యశాస్త్రప్రకారము, మందులు, పథ్యపానీయములు వివరింపఁబడినవి. కావున ఎల్లవారికి నిది సంజీవనివంటిది. 1911-వ సంవత్సరము జూన్ నెలలో జరుగఁబోవు 'విజ్ఞానచంద్రికా పరిషత్' పరీక్షకు పఠనీయము. చందాదారులకు పోస్టేజితో రు. 0-4-0 ఇతరులకు పోస్టేజికాక రు. 0-6-0

---

# తయారగుచున్న గ్రంథములు.

| | గ్రంథము. | కర్త. |
|---|---|---|
| 1. | చంద్రగుప్త చక్రవర్తి, | శ్రీవిద్యానందస్వామి, బి. ఎ. |
| 2. | సద్వర్తనము, | కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ. |
| 3. | అర్థశాస్త్రము, | సి. రామలింగారెడ్డి, ఎం. ఏ. |
| 4. | మహారాష్ట్ర విజృంభణము, | కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ. |
| 5. | జంతుశాస్త్రము, | ఆ. లక్ష్మిపతి, బి. ఏ. ఎం. బి. సి. ఎం. |
| 6. | కళింగదేశచరిత్రము, | గురుజాడ అప్పారావు, బి. ఏ. |
| 7. | భౌతికశాస్త్రము, | ఎం. నరసింహం, బి. ఎ. ఎల్. టి. |

---

మేనేజరు, విజ్ఞానచంద్రిక, చింతాద్రిపేట, మద్రాసు.

## రాఁబోవు గ్రంథము.

### రావుబహద్దూరు కం. వీరేశలింగముగారి

# స్వీయచరిత్ర.



ఇంగ్లీషుభాషలో మహనీయుల స్వీయచరిత్రలు పెక్కులున్నను తెలుఁగులో నేటివరకు నొక్కటియు లేకపోవుట గొప్ప లోపమనియుఁ దాని నెట్లు తొలగింపనగుననియు మేము చింతించుచుండఁగా రావుబహద్దరు కందుకూరి-వీరేశలింగము పంతులుగారు తమ స్వీయచరిత్రమును ప్రకటించు గౌరవమును మాకుఁ గలుగఁజేసిరి. గద్యతిక్కనయైన ఈమహనీయుని గుఱించిగాని, వారిగ్రంథములను గుఱించిగాని మేమధికముగా వ్రాయుట కాగడాతో సూర్యునిఁ జూపించుటయే!

గర్వముగాని, స్వాతిశయ భావముగాని యెంతమాత్రమును లేక, యున్నదియున్నట్లు యథార్థచరితము ఇందుఁజక్కనిభాషతో వ్రాయఁబడినది. ఈ చరిత్రముఁజూచి పంతులవారి విరోధులుగూడ తలయూచెదరని మానమ్మిక. అచ్చులోనున్నది. త్వరలోనే వెలువడును.

---

విజ్ఞానచంద్రిక మేనేజరుగారికి
చింతాద్రిపేట మదరాసు.

అయ్యా!

నన్ను శాశ్వతపు చందాదారుగా చేర్చుకొని పుస్తకములన్నియుఁ వి. పి. గా పంపగోరుచున్నాను. ప్రవేశపురుసుము నాలుగణాలు ఇదుతో పంపుచున్నాను. లేక ఈ నాల్గణాలు వి. పి. ద్వారా రాబట్టుకొనవచ్చును.

పేరు ..........................................................

హోదా. ..........................................................

గ్రామము..........................................................

పోస్టు.............................. జిల్లా..............................

☞ వెనుకటిగ్రంథములఁ గొననియెడల రు 1—0—0 ప్రవేశపురుసుము చెల్లించవలెను.

# ప్రకటనలు.

సుందరుల మందారము. **హిందూసుందరి.** రమణుల యాభరణము.

ఇది ప్రత్యేకము స్త్రీలకొఱకు ప్రచురింపఁబడుమాసపత్రిక. విదుషీమణియగు శ్రీమతి మొసలిగంటి రామాబాయమ్మగారు దీనికి సంపాదకురాలు ఇందు పాతివ్రత్యము, దైవభక్తి, గృహిణీధర్మములు, శిశుపోషణము, గృహనిర్వాహకవిధులు మొదలయిన స్త్రీలకత్యంతోపయుక్తములగు విషయములు పండితులగు నారీమణులచే వ్రాయఁబడుచుండును. పురాణకథలు, నవీనచరిత్రలు, ప్రహసనములు, పద్యములు, ఉపన్యాసములు, సాధ్వీమణుల జీవితములు ఇందు విశేషముగనుండును. కుట్టుపనులు నేర్చుకొనువిధము, పూలచెట్లు బెంచురీతి, ఉపాధ్యాయుఁడక్కరలేకుండ విషయము బోధపడునంత సరసముగా బొమ్మలతో వ్రాయఁబడును. మంగళహారతులు, కీర్తనలు, పాటలు మొదలగునవి యుండును. ఈవిషయమావిషయమననేల అతివలకత్యంతావశ్యకములగు పలువిషయము లిందుండును. చదువనేర్చిన ప్రతిస్త్రీయొక్క చేత నుండదగినది.

☞ ఈకార్యాలయమునందు స్త్రీలవశ్యముగా పఠించవలసిన వనేకగ్రంథములు సరసమైనవెలకు దొఱకును.

వలయువారు సత్తిరాజు సీతారామయ్యగారు,

మేనేజరు, హిందూసుందరి.

కంతేరుపోస్టు, కృష్ణాజిల్లా.

అని వ్రాయవలయును.

ప్రకటనలు.

# భాషాభిమానులారా!

ఇప్పుడు సంపుటములుగా ముద్రింపఁబడియున్న రావుబహాదూరు కందుకూరి-వీరేశలింగము పంతులుగారి పుస్తకములు పది సంపుటములును విక్రయమునకు సిద్ధముగానున్నవి. 16 పౌనులు గ్లేజుకాగితముమీఁద ముద్రింపఁబడి కాలికోగుడ్డతో నిండుగా బైండుచేయఁబడిన సంపుటములు ప్రత్యేకముగా నీ క్రింది వెలలకు దొరకును.

| | | | రు. | అ. |
|---|---|---|---|---|
| 1 | సంపుటము. | ప్రహసనములు. | 2 | 8 |
| 2 | ” | నాటకములు. | 2 | 8 |
| 3 | ” | భాషాంతరీకృత నాటకములు. | 3 | 0 |
| 4 | ” | వచనప్రబంధములు, పద్యకావ్యములు. | 3 | 0 |
| 5 | ” | స్త్రీలకుపయోగించు కథలు. | 3 | 0 |
| 6 | ” | స్త్రీలకుపయోగించు పుస్తకములు. | 3 | 0 |
| 7 | ” | ఉపన్యాసములు. | 3 | 0 |
| 8 | ” | ఉపన్యాసములు, జీవనచరిత్రములు. | 3 | 0 |
| 9 | ” | సాహిత్యప్రకృతిశాస్త్రగ్రంథములు. | 3 | 8 |
| 10 | ” | కవిచరిత్రములు. | 3 | 0 |

అంచెకూలి కొనువారే పెట్టుకొనవలయును. ఈసంపుటములపై గిల్టక్షరములు వేయబడియున్నవి. సంపుటములన్నియు మొత్తముగాఁ గొనువారికి సంపుటములు పదియు నిరువది (రు. 20-0-0) రూపాయలకే యియ్యఁబడును. విడిపుస్తకములుకూడ దొరకును. వలయువారు రావుబహాదూరు కందుకూరి-వీరేశలింగము పంతులుగారు రాజమహేంద్రవరము అని వ్రాసికొనవలయును.

# ప్రకటనలు.

## శ్రీవాల్మీకిరామాయణ ప్రకటనము.

శ్రీవాల్మీకిరామాయణములోని ఆరుకాండలను ఆంధ్రతాత్పర్య విశేషార్థములతోడ తేటతెనుగులో వ్రాసి ముద్రించియున్నాము. ఎడమవయిపు పుటలలో శ్లోకములు కుడివయిపు పుటలలో శ్లోకముల నెంబరుప్రకారము తెనుగుఅర్థము వ్రాయఁబడియున్నది. కనుక పారాయణము చేసికొనుటకు, లేదా కథనుమాత్రము చదువుకొనుటకు మిగుల అనుకూలముగ నుండును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| బాలకాండ | ... | ... | ... | 1 | 3 | 0 |
| అయోధ్యకాండ | ... | ... | ... | 2 | 5 | 0 |
| ఆరణ్యకాండ | ... | ... | ... | 1 | 3 | 0 |
| కిష్కింధకాండ | ... | ... | ... | 1 | 3 | 0 |
| సుందరకాండ | ... | ... | ... | 1 | 3 | 0 |
| యుద్ధకాండ | ... | ... | ... | 2 | 5 | 0 |
| వాల్మీకిరత్నములు | ... | ... | ... | 1 | 7 | 0 |
| ఆంధ్రమహాభారతరత్నములు | | ... | ... | 1 | 7 | 0 |

## సంస్కృత మహాభారతము.

| | | | | |
|---|---|---|---|---|
| విరాటపర్వము:—ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 4 | 0 |
| సభాపర్వము:—ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 8 | 0 |

శశిలేఖ. ఇది 16 సంవత్సరములనుంచి అవిచ్ఛిన్నముగా వారమునకు రెండుసారులు ప్రచురింపఁబడుచున్న వార్తాపత్రిక. ఇందు దేశదేశముల సమాచారములు ఇంగ్లీషులోని మహోపన్యాసముల భాషాంతరీకరణములు సాంఘిక, పరిశ్రామిక, రాజకీయ, భాషావిషయక, అంశములనుగురించిన స్వతంత్రవ్యాసములు కలిగియుండును. చందా సం॥ ముకు 6-0-0 మాత్రమే. తగినప్రోత్సాహము దొరకినేని దినపత్రిక చేయదలచుచున్నాము.

పైధరలలో వి. పి. పోస్టుకర్చులు చేరియున్నవి.

విక్రయ ప్రదేశము.

గటుపల్లి - శేషాచార్యులు,

శశిలేఖా ఆఫీసు, జార్జిటవున్, చెన్నపురి.

ఆయుర్వేద మార్తాండభిషఙ్మణి పండిత
డి. గోపాలాచార్యుల వారిచే ఆంధ్రీకరింపబడిన ఆయుర్వేద గ్రంథము.

# మాధవనిదానము.

అనేకవ్యాఖ్యాతల యభిప్రాయములతోడను, చరకశుశ్రుత వాగ్భటాదుల మతములతోడను, వ్రాయబడినది.

**1.** వైద్యుల సహాయములేకనే సులభముగ వ్యాధులను గుర్తించునటుల జేయుటయందు దీనినిమించిన గ్రంథమింకొకటిలేదు.

**2.** జ్వరము, అతిసారము, పాండు, నంజు, మొదలగు 100 ప్రధాన వ్యాధులయొక్కయు, వాని అంతర్భూతములగు 1000 రోగములయొక్కయు పుట్టుటకు కారణములను, అవి రాబోవులక్షణములను, వాని నిజస్వరూపములను, విశేషముగ వ్యాపించురీతులను, వాని సంఖ్యాభేదములను, సాధ్యాసాధ్య లక్షణములను, వ్యాధులు కుదరవనుటకు సూచించెడు ఉపద్రవములను, ఇట్టి యనేక విషయములనన్నింటిని ఈగ్రంథము విపులముగ సూచించుచున్నది. ఈ గ్రంథము సంస్కృతమున గల పంజిక, మధుకోశ, ఆతంకదర్పణము, మొదలగు వ్యాఖ్యానముల ననుసరించియు భాషాంతరీకరింపబడినది. సామాన్యముగ వ్రాయబడిన ఆంధ్రటీకలవలెగాక అనేకవిషయములతో నిమిడియున్నది. సంస్కృతము రానివారికిని, ఆంధ్రభాష సామాన్యముగ వచ్చినవారికిని, వైద్యసామాన్యులకును మిక్కిలి యుపయోగము.

**3.** ఉపోద్ఘాతమునుబట్టి ఆయుర్వేదముయొక్క ప్రాముఖ్యత, సత్సంప్రదాయము చక్కగ విశదమగును. రాయల్, ఆక్టివో, 50 పౌనులు గ్లేసుకాగితములమీద సుందరముగముద్రింపబడి రమారమి 600 పుటలు కలిగియున్నది.

వెల, పోస్టుఖర్చులుగాక రు. 3—0—0.

ఆయుర్వేద మార్తాండ భిషఙ్మణి.

**పండిత డి. గోపాలాచార్యులు, ఎ. వి. యస్.**

ప్రిన్సిపాలు యస్. కె. పి. డి. ఆయుర్వేదకాలేజి. సీనియర్ ఫిజిషన్ యస్. కె. పి. డి. హాస్పిటల్, మద్రాసు; ఎగ్జామినర్ మైసూరు ఆయుర్వేద విద్వత్ ఎగ్జామినేషన్సు.

ఆయుర్వేదాశ్రమం 55-ఆచారప్పన్ వీధి, జార్జిటవున్,

చెన్నపట్టణము.

టెలిగ్రామ్ అడ్రెస్ "PANDIT" MADRAS.

## ప్రకటనలు.

# దేశమాత.

ఇది యొక వారపత్రిక. సంవత్సరమునకు చందా మూడు రూపాయలు. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు యీ పత్రికకు అధిపతి. ఇందు విదేశ వృత్తాంతములు, స్వదేశ వార్తలు, చిత్రకథలు, హాస్యములు, ప్రకృత శాస్త్రవిషయములు మొదలగునవి ప్రకటింపబడుచుండును. కావలసినవారు రాజమహేంద్రవరము పత్రికాధిపతిగారికి వ్రాసికొనవలయును.

# మనోరమ.

ఇది బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచేఁ బ్రచురింపఁబడు తెలుగు మాసపత్రిక. ఇందు వినోదములు దేశమునకు మతమునకు మహోపకారము చేసి కీర్తిశేషులయిన మహాపురుషుల జీవనచరిత్రలు సృష్టియందలి వైచిత్రియములను దెలియ జేయు మహాద్భుతములు, రసవంతములై మృదుపదసంయుక్తములై యొప్పు నాటకములు, నూతన కల్పనలతో నిండియుండి చదివినకొలఁది చవులుగొల్పు చక్కని కథలు, చిత్రకల్పనలతో రచియించిన చిత్రవచన కావ్యములు (Novels) బ్రచురింపఁబడు చుండును. ఈ మాసపత్రికను జదివినవా రందఱు దీనిని భాషాప్రౌఢిమగల పత్రికలలో నొకటియనియుఁ బండితులకుఁ బామరులకు స్త్రీలకు బాలురకు నత్యంతోపయుక్త మనియు నీతిదాయకమనియుఁ దలంపకపోరు. చందా సంవత్సరమునకు మూడు రూపాయలు. వలయువారు "మనోరమ పత్రికాధిపతిగారికి రాజమండ్రి" యని వ్రాసిన బడయగలరు.

# ప్రకటనలకు అత్యుత్తమసాధనము.

1. మాకు 2000 మంది చందాదారులు కలరు. ప్రతి గ్రంథముయొక్క 3000 ల ప్రతులు అచ్చువేయించుచున్నాము. మాగ్రంథములు స్త్రీలు, పురుషులు చదువుదురు. మాపుస్తకములు కొన్ని యూనివర్సిటీ పరీక్షలకు నియమించియున్నారు. కొన్ని పాఠశాలలలో పఠనీయములుగా ఏర్పరచి చదివించుచున్నారు. ఈగ్రంథమాలకుగల వ్యాపకము మరియే గ్రంథమునకును, ఏగ్రంథమాలకును లేదు. కావున దీనియందు ప్రకటనలు వేయువారికి అత్యంతలాభకారి యని మేము వేరుగ వ్రాయనక్కరలేదు.

2. ప్రతిగ్రంథముయొక్క చివర కొన్ని ప్రకటనలు వేయుదుము. ఈప్రకటనలు కేవలము భాషావిషయకములు మాత్రమే యయియుండును. మందులు మొదలగునవి మేము ప్రకటించము. ఆంధ్రభాషలోని స్మృతులు, కావ్యములు, నాటకములు, నవలలు, ప్రహసనములు, దేశచరిత్రలు, వారపత్రికలు, పక్షపత్రికలు, మాసపత్రికలు మొదలగు వానినిగురించి ఏమితెలిసికోవలసి వచ్చినను, ఒక్కచోట చప్పున గనుపడునటుల చేయఁదలచినారము. కావున గ్రంథకర్తలు, పత్రికాధిపతులు తమ తమ గ్రంథములను, పత్రికలను, ఇందు ప్రకటించి ఎక్కువలాభమును బడయుదురని నమ్ముచున్నాము.

3. మాప్రకటనముల తమ పత్రికలో వేయు పత్రికాధిపతుల ప్రకటనలు మాపుస్తకముల చివరనుచితముగా వేయఁగలవారము.

4. ఇతరులు ఒకసారి ఒకపుట ప్రకటనవేయుటకు రు. 10-0-0 లు ఈయవలెను. అరపుటకు 6-0-0 లు. ఒక్కసారి నాలుగుపుటలు వేయువారికి రేటు తగ్గించఁబడును. అరపుటకన్న తక్కువప్రకటన తీసికొనఁబడదు.

5. మాకు ప్రతిదినము క్రొత్తక్రొత్త చందాదారులు వచ్చుచున్నందునను, మాగ్రంథములు ఆంధ్రభాషలో శాశ్వతముగ నుండునవి గనుకను ఇందొకసారి ప్రకటన వచ్చినయెడల అది భాషలో శాశ్వతముగనుండును. వారపత్రికల, మాసపత్రికలవలె అప్పుడు మాత్రము చదివి అవలఁ బార వేయునట్టివి మాగ్రంథములుకావు. గనుక వీనియందు బ్రకటనలు వేయువారికి మిక్కిలి లాభముండునని చెప్పవచ్చును.

మేనేజరు, విజ్ఞానచంద్రిక,
చింతాద్రిపేట, మద్రాసు.